ఎందురా యెందుకనుచు॥

98 కీర్తన—ఆటతాళం.

నందానందన యాదవకులజా - పాహిగోవిందా ॥నం॥ వందితభూసురబృందనిరంతర బృందావనగోవిందవిహార ॥నం॥ నేడునీవాడనాజతగూడు - నీకన్నిటిలోడు - నిన్నేనమ్మితికరుణజూడు - వేడుకలోనివాడననుకొని యాడినన్నదయజూడవదేమి ॥నం॥ నిన్నేశరణానివేడుకున్న - ఘనసుప్రసన్న నేరమెన్నకబ్రోవన్న - యెన్నడైననిను సమ్మతిలోవేరున్నదె చిత్తము పురగారిధ్వజ ॥నం॥ దీనిసముదయచిత్తలోల-సుగుణవిశాల - దివ్యసుందరగోపబాల - భానుకోటిసమభవ్యతేజసుర గానలోలరాకమచర్లాధిప ॥నం॥

99 కీర్తన—ఏకతాళం.

ఘనుడనుచు వందనమొనరించితి మనమునదయజూడు - దినదినమును పంచశరాయతుమనిఅనయము నేడితినిమదిని ॥ఘ॥ యితరమెరుగ సువర్ణితుడవనుచు నామతిలోదలచిన సతతమునా మొర సమ్మతించ్నివతిదయతోజూడు నేడూ॥ఘ॥ గొప్పదొరవుదయగుప్పితె యెవరికిజెప్పనుదీతోడూ దప్పిజెందినినుదలచినమాటకు యిప్పుడుచేకొమ్మిరమ్మి ॥ఘ॥ వరమపురుష నీచరణసరోజము మనసునజేర్చితిని - స్థిరముగరాకమచర్లస్వామివన ధరణిలోచాటింతూ భజింతు ॥ఘనుడను॥

100 కీర్తన—ఆటతాలం.

కంటిరెమిాలోనకమలాక్షుడున్నాడు కాంతలార-వింటిరెగురువాజ్ఞ విధమంత దెలియగ వెలదులారా ॥వ॥ చూపుమనుచు వక్కరూపుగచూడరే సుదతులారా - అందు వ్రాపించివెలగు చిద్రూపమై యుండునుచేడెలారా ॥కం॥ కుండలినడుమ యాఖండమయియుండును కొమ్మలారా- అందుదండిగ శ్రీహరివుండజూడరెమీరు జాణలారా ॥కం॥ వరభక్తితోడుత యిరవందియుండారా కొమ్మలారా - సిరిగుల్కు రాకమచర్ల గిరీశుజాచేడెలారా ॥కం॥

101 కీర్తన—అటతాలం.

భవనాశాయగబూనినాను శ్రీరామనామభజన॥భవ॥ భజియించె

దదుర్భవవమున దోలంగగ సుజనసంఘములుసొంప్పవహింపగ ॥భజ॥ విష్ణు
దైవమానిదలచి - సద్గురు గొలచి - విమలవైరాగ్యమూనసిలచి -
తత్త్వతీరసవలో యజలోచన - కృష్ణకృష్ణ శ్రీకృష్ణాయనిసే ॥భ॥ కామాదిగు
ణములెల్లవిడచి - మోహము మడచి - పామరమార్గములవిడచి వేమరునా
మదిప్రేమవహింపగ - రామరామ శ్రీరామాయనిసే ॥భ॥ అరలేనిభక్తి
నావరించి - పరిపూర్ణనిశ్చలపరతత్త్వయోగమొసాధించి - పరిపరివిధముల తే
పులరుగక నిరతము శ్రీహరి హరిహరియనుచును ॥భజ॥ దాసాభావము
మదిలోనసమ్మి - రాకామచర్లవాసునియందు మనసుగుమ్మి - వాసిగన
ను దయజేసిబ్రోవగల వాసుదేవ శ్రీవాసుదేవయని ॥భ॥

## 102 కీర్తన—జంపెతాళం

జయనందకంఠా - జయతుగోవిందా భయనాశసర్వేశ పాలితన
ందా ॥జయ॥ భానుప్రకాశా - బవ్యదరహాసా - మాసితవిలాసా మహి
తలోకేశా ॥జయ॥ నిరుపమాధ్యక్షా - నీరజాతాక్షా - కరిరాజవరదప్రేక
రుణాకటాక్షా ॥జయ॥ సరసవిస్తారా - సాగరవిహారా పరమపావననామ
భక్తమందారా ॥జయ॥ పరమగంభీరా - పాపసంహారా - సరసరాకమచ
ర్లస్వామియదువీరా ॥జయ॥

## 103 కీర్తన—అటతాళం

వందేహంగోపాలకిశోరం వాసుదేవం ॥వం॥ వంకీకృతసురబృందసరం-
తర - కందర్పాంచిత ఘనసుకుమారం ॥వం॥ మలాలంకు హృత్పంకజదివా
కర - మమహితవైభవ శోభనచరితం ॥వం॥ వంశధరార్చిత వైకుంఠా
ధిప - కంసహారణసంకటపరిహారం ॥వం॥ ఘనమోహనవరకౌస్తుభభూషణ-
వనరుహోత్థబుధపరిసేవితమృదుపద ॥వం॥ చారునీరదాకారశరీరవికార దూర
రాకమచర్లాధిప ॥వందేహం॥

## 104 కీర్తన—ఆదితాళం

నందానందముకుంద జయనందా ॥నం॥ యిందీవరపూర్ణేందుని
భానన మందరధరగోవిందయాళో ॥నం॥ పరిశోభకర శ్రీవాసుదేవభూసు
రజనసేవితసుందరరూపక ॥నం॥ దర్వీకరవరతల్పకదితిసుత దర్పహరణశ్రీకర

కరఫలదాయక ॥నం॥ నిఖిలాగమనుతయఖిలజనావన సుఖదాయకషణ్ముఖు జ్ఞార్యోన్నత ॥ం॥ పురుషోత్తమ సంపూర్ణవిభవ దుస్తరభయహారభా స్కరసమ తేజ ॥నం॥ లలసితభాస్కరవిమలచరిత సత్కలితశాంత రాకమచ ర్లాధీశ నంర॥

105 కీర్తన—అటతాళం.

శ్రీవాసుదేవహరే మాసురశౌరే-శ్రీవాసుదేవహరే ॥ప॥ దేవజీవ మహాత్మ స్వనపావనానిజసేవకావన - కేశవానందైకవైభవ గిరిజను న్నుతనామమురహార ॥శ్రీ॥ పరహితవరశాంతా-వరలక్ష్మీకాంతజయదూ రసుస్వాంతా - గురుగంభీరసురారిభంజన కువలయేశ్వరదయాకర-కరుణా నాగర సర్వరక్షణకవిత సుందరపాదసరసిజ ॥శ్రీ॥ మందారనగధరా - లో కోపకార మహాన్వయపరివారా - యిందుబింబసమానవదన పురందరార్చిత నందనందన—మందహాసముకుందమాధవ వందితామర బృందసంతత ॥శ్రీ॥ సలలిత ఫలదాయకా_కోదండనాయకసరస పాణినాయకా-నలిననాభ సదాముదప్రదా నారదాది మునీంద్రసేవిత-కలితరాకమచర్ల మందిర లలి త వెంకటదాసపోషణా ॥శ్రీ॥

106 కీర్తన—జంపెతాలం.

బాలముకుందంపాహిగోవిందం - పాలితసుశీలమునిజాల నానంజం ప్రభానుని తేజం బక్తసురభూజం-జ్ఞానవిజ్ఞానప్రజ్ఞానావిరాజం ॥బాలం॥ కరుణాకటాక్షం - కలుషజనశిక్షం - గురువినుత వరచరితసురచిరాధ్యక్షం॥ బా॥ సలలితవిలాసం సజ్జననివాసం _ కలితరాకమచర్లనిలయలక్ష్మీశం ॥బా॥

107 కీర్తన—ఆదితాళం

చెలియా జీవునిలోని దేవుడేలక్కరో - వెలయామిక్కుటానవున్న డవోచెల్లెలా॥ వున్నచోటచిన్నెలన్ని కన్నవేమెలక్కరో - పన్నుగాగురు మంత్రార్థభావమేవోచెల్లెలా ॥భావమాత్మ గన్నయట్టి పొడమెవ్వరెల క్కరో - అవలీవలసంచరించెటి ॥అంతరాత్మేచెల్లెలా॥ అంతరాత్మ కావలై న ఆతడెవ్వడెలక్కరో-సంతతాబ్రహ్మానందసాక్షి భూతుడెచెల్లెలా॥సా క్షియేమిటజూడనోపును చక్కదెల్పవెలక్కరో - దక్షుడయిగురుదీక్షజెంది

నస్వానుభావమె చెల్లెలా ॥ స్వానుభావంబను మాటజాడయేదెఅక్కరో - మానకచేతనమూర్తి మర్కమేవో చెల్లెలా॥ మర్మకర్మములన్ని అంతటనీవ శంబగు అక్కరో-ధర్మమార్గముసంచరించుటకి దారిజేరునెచెల్లెలా- యెన్న రానివందువెన్నెల వున్నదేమెఅక్కరో -కన్నవారలకెల్ల శ్రీహరికాంతుడె వోచెల్లెలా॥ వున్నభావముకన్న మిక్కిలివున్న దేమెఅక్కరో-సన్నుతారా కమచర్లస్వామిసత్యమెచెల్లెలా -

మంగళహారతి—చాపుతాళం

మంగళంనందతనయుతె - వాసుదేవమంగళాయానుమోదతె ॥వ॥ యింగితప్రసంగబవిబంగమౌని వుంగవార్చితాంగ ఖగతురంగ సమరసం గరామరారిబంగ ॥మంగ॥ భూరికలుషచయనిమోచనా - దేవాదిదేవ - వుణ్యగణవిధునిభావనా - సూరి జనవిహారయదుకుమార మారకోటిసా కుమారనిర్వికార నిలనిరదాబవశరీర ॥మం॥ సురచిరాశ్రితప్రపోషణా - సద్విశేషుగురుతరాపశ్రశ్యశస్ద్గుణా - శరజసంబవాదివినుతచరితజలధిశయన సకలదురితహరణద్విరదరాజపరిదసత్కృపాకలాప॥మం॥ పండితాంతరంగఖేల నా - పుణ్యశీలబక్తసముదయావనపాలనా - కుండలీశశయన రత్నకుండలా బరాణవికచ - పుండరీకనయన ప్రపపాండజనక పరమపురుష ॥మం॥ ప్ర కటనిపుణసుజనపాలనా - రాకమచర్లబవన వెంకటదాస జీవనా-సకలసు కవినికరవినుతచరణసరసిజప్రభావ - అకుటిలాత్మయోగివిమల శుకముఖాజ్జ వరద వేశ ॥మంగళం॥

గద్యం.

ఇది శ్రీవత్సకౌస్తుబకటక కేయూర కిరీటకుండల గ్రైవేయక తారాహారా వళినందక కౌమోదక పాంచజన్యసుదర్శనాద్యాయుధదివ్యమంగళ విగ్రహుండును గరుడధ్వజుండును వైకుంఠనిలయుండునునగు శ్రీవాసుదేవ పరబ్రహ్మ పాదారవింద సేవాధురీణుండును పరమభాగవతోత్తముండును నగు శ్రీమద్రాకమచర్ల నివాస వెంకటదాసార్యులవారి కీర్తనలు ప్రదమభాగము బగవదర్పితముగాను లిఖితాః.

శ్రీమత్సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరఘునందన పరబ్రహ్మణేనమః

# రామచర్ల

# వెంకటదాసార్యులవారి

మానసపూజ ప్రారంభం॥

శ్లో॥ నమామి నారాయణ పాదపంకజం
సదామి నారాయణ నామనిర్మలం
భజామి నారాయణ తత్త్వమవ్యయం
కరోమి నారాయణ పూజనంసదా

శ్లో॥ ఆలోక సర్వశాస్త్రాణి విచార్యాచ పునఃపునః
యిదమేకంతునిష్పన్నం ధ్యాయేనారాయణంసదా.

మనోబోధ కీర్తన — ఆటతాలం.

చూపబోదమురావెచిత్తమా। హరిని వేడుకదర్శించి వత్తమా॥ప॥ చూడబోదమురావె చూడ్కులకింపుగ। జోడుబాయకలక్ష్మితోడవెలుగు నట్టి॥చూ॥ యిరివంటహరిపేరుదల్తమా।వానిచరణయుగంబులుగొల్తమా కరమొప్పమదిలోన మరివేమురంజిల్లు సరసిజనయనుని పరసుందరమునే డు॥చూ॥ నిక్షేపమనినమ్మికుందమా। సంమ్మురక్షింపుమని వేడుచుంద మా। అక్షయసదర్మలక్షణుడైనట్టి। పక్షివాహననామ భజనజేసినేడు॥ చూ॥ తలచివాని రకుండను। హరిదాసులమనిచాటుచుందమా। వలనొ ప్ప శ్రీహరివలనసెమ్మదిగోరి కలితరామచర్ల నిలయునిమదినేడు॥చూ॥

క॥ శ్రీకాంతాహృదయేశ్వర - లోకజనస్తుత్య భక్తలోల సుశీలా
నేకాత్మనివహపోషా - రామచర్లాద్రిధామ రాఘవ రామ.

కీర్తన — ఏకతాళం

రామా తారకనామ - రామ॥ప॥ రామరాజితకామబుధావనతా మరసాక్షసనామతరాత్పర॥రా॥ జనకజమానస వనరుహ దినకర। సనకస నందన సన్నుతదశరథ॥రా॥ మానితకౌశికమఖపరిపాలన। దానవహరణ

సమానరహితరఘు ॥రా॥ తాటకగర్వోత్పాటనభూసుర । కోటివినుతనవ కోమలపదయుగ ॥రా॥ దశముఖకంఠ విదళితశరాసన ।రసికమనోహరరా జతేజజయ ॥రా॥ వానిసిఖండన వారధిబంధన । పాలితముినిజన జాలను రార్చిత ॥రా॥ రావణహార్ణ విరాజితభూషణ । గోవిదసన్నుత కువలయపో షణ ॥రా॥ అమితయోగగౌతమసతిగణ్య ।కమలనయన రాకమచర్లాధిప॥ రామ॥

కం॥ నానాజన్మఫలంబుల - బూనినకర్మములుబోవ పొందుగమిమ్మున్ ధ్యానించెదనామనమున - మానకదయజూడునన్ను మరువకురామా

కీర్తన ధ్యానం—ఆటతాళం

ధ్యానాపార్క్షినా రాముణ్ణి-మాంపాహినిత్యధ్యానాపార్క్షినా రాముణ్ణి ॥ప॥ దీనజనావనమానితసు దర్శనయోగసంధానవిధాన ॥ధ్యా॥ చ తుశ్శ్రీవణాద్యతిశయనకనకాత్మశిక్షణపక్షివాహన ॥ధ్యా॥ అమలకమల దళ విమలనయనభవ శమదభక్తహృత్కమలనివాస ॥ధ్యా॥ తారహారనీ హారకుందమందారకీర్తి విస్తారమేశా ॥ధ్యా॥ లోకపాలసురలోకఖేలఘన శ్రీకరరాకమచర్లవిహార ॥ధ్యానా॥

కం॥ పచ్చలుదాపినపీటము - మెచ్చుగమీకిడుదునేను మించినదయచే మచ్చికతోనను బ్రోవగ - యిచ్చటవశియించికోర్కెలివ్వవె నాను.

కీర్తన సింహాసనం—ఏకతాళం,

రార । గోపాలబాలరార ॥ప॥ రారమునవిగెకోర మొర్రెక్కెదను నీ రజాక్షనా నేరములెంచక ॥రా॥ ముజ్జగములుగల బొజ్జకదుకగను గజ్జలప దములు ఘల్లుఘల్లుమోయగ ॥రా॥ శృంగార బగు చెలువుమీరగను బంగ రుచేలము చింగులజారగ ॥రా॥ ఉరమునముత్యపు సరులుమెరయగను స రసిజలోచన చిననవ్వునటు॥రా॥ శంఖముచక్రము శార్ఙ్గపద్మమును పం కజాక్షనీ బాహులనమరగ ॥రా॥వనమాలాంచితపక్షస్థలిసర్వ కౌస్తుభమణిత ళతళమనగను ॥రా॥ కుండలదీపులుగండయుగళమునలసిడి వెలుగ తూఖండ తేజముటు ॥రా॥ దీనమణీకాంతుల దివ్యకిరీటము శిరమున మెరయగచిన్న నవ్వుమిటు ॥రా॥ అచ్చపుభక్తిని అనుసరించితిని పచ్చలపీటము బాగుగ

బ్రోచెద ॥రా॥ ధరణిలో వెంకటదాసుబిలువగ సిరిగలరాకమచర్లస్వామి యిటు ॥రా॥

క॥ సద్యోముక్తిగనుంగొన - హృదయంబునమీప్రభావ మేర్పడఁబ్రజ్ఞా
భేద్యుడవనివర్ణించుచు - పాద్యంబర్పింతునన్ను బాయకరామా.

కీర్తన పాద్యం—ఆటతాళం

పాద్యంబిచ్చెదరామా - ననుపాలించవెగుణధామా ॥ప॥ పాద్యంబిచ్చెద భావ్యముచేతను సద్యోముక్తినొసంగెటిదొరవని ॥పా॥ తారకనామముపొగడిన - నీదాసులతోడుగగూడి- నారాయణశ్రీనరహరియనుచును సారెకుమిమ్ముల సన్నుతిసేయుచు ॥పా॥ సంసారాంబుధిగడచి-మీచాటువజేరగదలచి - కంసహరణననుగావవె దేవోత్తంసుడవని మీదాస్యము గోరుచు ॥పా॥ బలువైరాగ్యముతోను - మరిసలలితమగు జలములను - చెంగుచురాకమచర్లస్వామివని పలుమరుమీమృదుపదపద్మములకు ॥పా॥ క॥ ఎంచగనాజగదుష్కృతి - సంచయములదోలుమనుచు సాష్టాంగముగా। వంచినుతించిభజించుచు - ముంచినవేడుకలనెనర్ఘ్యమిచ్చెదరామ,

కీర్తన ఆర్ఘ్యం—జంపెతాళం.

ఇదిగో ఆర్ఘ్యమిత్తునయ్యా - చాలమోదమందిగైకొనరయ్యా ॥ఇ॥ప॥ యిదిగో ఆర్ఘ్యములుమీకొలమిసంతసమంద - మదిలోనమీమృదుపదపద్మములునమ్మి ॥యి॥ వరసిజనయనవాసుదేశా - భక్తవరదమాధవచిద్విలాసా - నిరతిశయవలోకభరితదయాకర - పరమపావనవరద్విరదరక్షకదేవ ॥యి॥ వండితాహృదయానివాసా। మణికుండలాప్రకాశా । దండిగా నేనునీఅండజేరగగోరుచుండెదా । నీవునాయండబాయకుమని।యి। రాకమచర్లవిహారా । సురరాజపూజితమణిహారా । లోకపాలకభక్తలోకమందారక శ్రీకరాచరితసుధాకర రవినేత్ర ॥యిదిగో॥

క॥ గంగాయమున సరస్వతి - రంగుగ కావేరిభీమ రథితోయములన్
బంగారుకళశములనిడి - అంగుగ నర్పింతుజలము లాడవెరామ.

కీర్తన మజ్జనం—ఆటతాళం.

మజ్జనమొనరింపవె । రామయ్యా నామనవిచిత్తగింపవె మ॥ మజ్జనమొనరించుమదిసంతసించాగ । ముజ్జగములకెల్ల మూలమైనతండ్రి ।మ। కాంచనకలశముల । నించినమంచిపంచామృతంబుచాల। మంచిశర్కరపాలు మధువుపెరుగునెయ్యి అచింతముగమేళవించి అర్పించెద ।మ॥ వరనాకేళిములూ పెంపయినట్టి గురుకాంతిరత్నములు । ఆయగపునుగు జవ్వాజి కస్తూరియు పరిమెళమునుగలుగు పచ్చకప్పురముచే ।మ। తెలియనైన పన్నీటనూ । తీరుగమంచిశుద్ధోదకముచేతనూ యిలలోనగలుగుసకలనది తోయములు బంగారవు గిండియలనుండినొసగెద ॥మ॥ యింగువతోడుత నూ । నామదిలోకళంకముదీరాగనూ । పొంకాముతో మీకు వెంకాటదాసుడు శంఖముతోనభిషేకముసేయగ ।మ। వుల్లాస ముప్పొంగనూ । చాల భక్తులెల్లసేవించగనూ । ముల్లోకములవారు మోదించగను రాకమచర్లవాసుడవయ్యాచెలగి జానకిగూడి ॥మ॥

క॥ నీచరితమాత్మబొగడుచు — సూచనజేసితినికరుణ జూడవెమరినీ
కాచమనంబర్పించెద — నాచిత్తమునందుమిమ్ము నమ్మియురా మా.

కీర్తన ఆచమనీయం—జంపెతాళం.

అచమనములిత్తునయ్యా । నన్నాదరించవె ముద్దులయ్యా ।ప। ఆచమనములిత్తు ఆనందముగకరుణ చేసిబ్రోవవె నేడు నాచిత్తమునమీకు ।ఆ। దాసభావముజెందినాను । నిన్నుదలతునెమ్మదిబక్తితోనూ । వాసిగానను కరుణచేసిబ్రోవుమటంచు । భాసురముగానుశ్రీకేశవాయనిమీకు ।ఆ। యేరీతినైనమీపాదవు । జేరగోరితిని మీదావుజూపూ । ఆరూఢి నాకోర్కెదీరనింపారగను । సారెసారెకును శ్రీనారాయణాయనుచు ।ఆ॥ నీదారితెలియనాతరమా । నన్నునెవరుజూచుటకుదాపరమా । నాదుభాగ్యమటంచు నమ్మియున్నాను బహుసాదరంబుగ జూడుమాధవాయని మీకు ॥ఆ। భావించియున్నమీపదమూ । నీకుబంటనయ్యున్నామునిజమూ । కానవెకలిత రాకమచర్లవాస మీసేవజేసెదను శ్రీగోవిందయనిమీకు ।ఆచ।

క॥ రభసంబుతోడ దీనుల
కభయంబొసగూడజూడుమని వేడుచుమీ

కభిలాష మొదవనిచ్చెద
అభివస్త్రముజన్నిదంబు లందవె రామా.

కీర్తన అభివస్త్రం—ఆది తాళం

అభివస్త్రములిచ్చెనయ్యా రామయ్యా । మీరంగుగ ధరించరయ్యా రామయ్యా ।ప। ఇభరాజవందిత పాదా రామయ్యా ॥ నాయభినుతార్థమివ్వ వయ్యా రామయ్యా ।అ। చాలగాబంగారు మెరుగు రామయ్యా । పట్టుచేలముదరించరయ్యా రామయ్యా ।౧। మేలైనజల్తారు గలుగు రామయ్యా । పచ్చశాలు మేనగప్పరయ్యా రామయ్యా ।అ। శ్రీకరరూపక సీతారామయ్యా । వరరాకమచర్లనివాసరామయ్యా ।అభి।

క॥ సుందరమగుమీమేమన ♦ కందంబుగగందమలది అతిపరిమెళమా
చందనముబూసిమోమున ♦ పొందుగకస్తూరి బొట్టుబూచెదరామ.

కీర్తన గంధం—ఆటతాళం.

కర్పూరగంధముబూసెదా । శ్రీకాంతమిమ్ములనుతిజేసెదా ।ప। వొప్పుగమీమది మెప్పురంజిల్లగ గొప్పపరిమెళము లుప్పతిల్లగమేన ।క। సుమహితమైచాలసొంపుగా । చూడహిమకరకాంతివహింపగా । అమరాగపునుగుజవ్వాజి కస్తురిచేత మమఘనుతాపలు గుమ్మరింపగమేన ।క। పొందుగమీ సేవసలిపెదా । చూడముందాటముకురంబునిలిపెదా। సుందరమగు మోమునందుకస్తురిబొట్టుపొందువరచి మోద మొందుచుమీర నేక॥ వాసిగమిమ్మదలంచెరా। నాదువాంచలెల్లనువిన్నవించెదా । శ్రీశరాకమచర్లవాసుడవనినుతి జేసినే వెంకటదాసుడవని మ్రొక్కి ।కర్పూర।

క। అకలంకమణిమయాంచిత ♦ సకలాబర్ణంబులెల్ల సమకూర్చియునందకశంఖచక్రదరమీ సకలాంగమలంకరింతు చెలగుచురామ.

కీర్తన ఆభరణాని—జుల్వాతాళం.

కరుణతో జూడరా బరణముద్దరించరాహా ।ప। సరిసిజాక్షమీపదముల మెరుగుబంగరుమువ్వలుపాదనరములందెలుబూజించికన్నులకరువుదీరగగందురా ॥క॥ మొలనుపసిడిబిల్లలత్రాగు కలుకుకాంచనచేలముపైన వెలయమందనవజ్రకాంతులోలుకుకవచమొలమిదొడగి ।క। చాలరుచులుగలు

గురత్నమాలికలును మెడను వేసి చెలిమలు పటీరమురము మీదకాంతి మెర
యనిడుదు ।క। ఘనముగాను పచ్చలకాంతి తనరు కటిసూత్రములును దొడగి వ
నరుముద్దుటుంగరములు వెలగి చక్కని వ్రేళ్ళ బూన్చి ।క। దండి కుండలములు
వీనులందునుండ గాధరించి భానుమండలాభ వగకిరీటము మరి శిరమునందునుని
చి ।క। వెలగి మంగళాంగములు నెలయు కౌమోదకియును కలితశంఖచ
క్రనందక కార్ముకంబు లెలమి బూని ।క। సరసమైన రాకమచర్ల హరిపటనుచు
మిమ్ము దలచి వరద వెంకటదాసుడిపుడు మురవైరి మీ శరణు శాయ ।క।

శ్లో। కరవీరజాజి చంపక ♦ వరచామంతులును మల్లె వకుళాబ్జములన్
సురపున్నతులసిదళముల ♦ కర మొప్పగ పూజసేతు గైకొను రామ

కీర్తన పుష్పపూజ—చాపు తాళం.

పూజసేతునయ్య రాఘవా । మహానుభావ ।పూ। పూజసేతునయ్య
భవ్యతేజ మీపదాబ్జములకు రాజితంబులైన సుపుష్ప రాజములను గూర్చి మి
మ్ము ।పూ। చెలువమైన బొడ్డుమల్లెలూ విరజాజులును - చాలపరిమళించు
మొల్లలూ । వెలయ కేశవాది చతుర్వింశతైన నామములను తలచి క్రమ
ముతోడ తులసిదళములవయమువములందు ।పూ। మెచ్చులలరు చంపకంబు
లూ సాదాబ్జములు— మించు కాంతి పొగడపువ్వులూ — వచ్చ చామంతివిరు
లు బాగుమీర కాంచనములు— అచ్చమైన భక్తి చేత మత్స్యకూర్మ నామము
లను ।పూ। చెన్ను మిగుల వకుళజాజులూ — వరపారిజాత మెన్న గలుగుచున్న
పొన్నలూ—వున్నతంబుగాను మీ మనోత్సవంబుగా నొనర్చి సన్నుతంబులై
నవిరుల సహస్రనామములాదలంచి ।పూ। కోరికలర వెలుగు గేదగులూ —
కరవీరములు నీరుగన్నేరు బిల్వాదళములూ—సారసాక్ష రాకమచర్లస్వామి న
న్ను గాపుమనుచు సారెసారెకు రయ ఓంకారముచ్చరించి మిమ్ము ।పూజ।

శ్లో। ఘుమ్మని పరిమళధూపము ♦ గ్రమ్మగ వాసించు మణులు గల సెమ్మెలు తే
జమ్ముగ నిరు దెలిసిడిదీ ♦ పమ్ములు వెలిగింపజేతు గైకొను రామ

కీర్తన ధూపదీపం—ఏకతాళం.

ధూపమాఘ్రాపయామి — శ్రీరామనామ దీపం దర్శయామి ।ధ।
ధూపమాఘ్రాపయామి దీపం దర్శయామి రూపించి నీమేనంతనంత వ్యాపించ

చి దీపించగాను ।ధూ॥ ఎంచగాద శాంగముపసింపజేసి రెండుదిశలకాంచన సన్నెలదీపకాంతులుల్లసిల్లగాను ।ధూ॥ సారమైనశ్రీగంధ ఖర్జూరసారము లనుగమ్మి మేరిపరిమళంబులింపులూరి తేజరిల్లగాను ।ధూ॥ వాసిగ రాకమచర్లవాసచిద్విలాస దయచేసి బ్రోవవయ్యా వెంకటదానునిచిత్తామచాత । ధూప ॥

క॥ పరమాన్నమతిరసంబులు ♦ మదిదధిఘృతసూపసౌఖ్య మగుమధ్యములు
స్వరమైడిపళ్ళెరంబున ♦ సరసాన్నము లారగింపు శాయవెరామ ॥

కీర్తన నైవేద్యం—చావుతాళం.

శాయవయ్యభోజనంబు జానకితోడను । చాయదేరురుచులతోడ లగిబంగరుపళ్ళెరమున ॥శా॥ పంచభక్ష్యములునబూరెలంచితముగ అతిరస ములుయెంచగలుగు పంచదారలుంచినట్టి పాయసములు ॥శా॥ పూరణంపు కుడుము లింపులూరితియ్యనిగరిజలిట్లు పూరుగాయలతోను మంచి కూర లాదింపుజేతు ॥శా॥ యింపుతోనుపచ్చడీలు హితముగాను చిత్రాన్నము లు సొంపులలరఅప్పడములు చోద్యమైన వడియములును ॥శా॥ మేలిమైన మంచినెయ్యిమీగడపాలుశర్కరలతోనుచాలమిశిమిదేరుచుండుసౌఖ్యమైన ఆవుపెరుగు ॥శా॥ ఉత్తరాపోషనంబు వుచితముగనుమీకునోసగ చిత్తమొ ప్పగించిమీకుసేవజేయబూనినాను ॥శా॥ తెలవిబంగరుకలశములను వెల యజలములోసగెదాను ఆలరునందుకొనవెయింపుచెలదిరాకమచర్లవాస॥శా కదళిదాళిక్షదాళిమజంబూ బదరిపనసమామిడిపండ్లు మొదలుకొనిన ఫల ములెల్ల మొనసివెంకటదాసుడియ్యగ ॥శా॥

క॥ మెప్పుగల జాజికాయలు ♦ గొప్పలవంగములు యాలకులుజాపత్రుల్
కప్పురపువిడియములుమీ ♦ కిప్పుడు మోదంపముసుపులిచ్చెద రామా

కీర్తన తాంబూల.—అటతాళం

విడెములివ్వచెదరామయ్య ఏమి మా భవ తారక రామ॥వి॥ విడెములో సెంగెద పుడిమిజవరయుపు । దడరినమడపుంచియెడ నెడము కిటె ॥వి॥ అగు గజాజికాయలును । మంచిజాపత్రి అరయముత్యములసున్నమూను । బంగ రుచాయల పండుటాకులును రంగుగకర్పూరపుపోకలచే ॥వి॥ సారంబులయు

న లవంగములు । తెల్లానికాచుచాలగ మెప్పుగలయాలకులు ! కోరికలల రగ నారికేళరుచులాడగనింపార నొసంగుచు ॥ని॥ తడవులేని వైరాగ్యమొసగి। నామనసులోన యెడలేనిదక్షిణమీకొసగి ॥ బడిబడివన్నినయెడబాయకుమని కడువేడుచురాకమచర్లాధిప ॥వి॥

క॥ బంగారుపళ్ళెరంబున ♦ రంగుగమణిదీపికలును రాజిల్లంగా
మంగళహారతి నీకిదె ♦ సంగతిగానిలచిసేవ సలిపెదరామ.

మంగళహారతి—ఆటతాళం.

హారతులిచ్చెదచూడవె। రామయ్యామంగళహారతులిచ్చెదచూడవె ॥ప॥ హారతులిచ్చెదచూడు సీరదాభశరీరజగిబం । గారుపళ్ళెరంబుసళ్ళంగా రమానీరాజములు ॥హా॥ దండినామములు మోయగా । పరివారమెప్పుచుండి మీకుసేవజేయగా । పండితులెల్లను జూచుచుండగ యాఖుడమైన మండితకర్పూర కాంతినుండి మీరుచుండ మంగళ ।హార। కోరికలెల్లనుదీరగా । బ్రహ్మాదిసురలుజేరిమిమ్ము దేరిచూడగా । శారదాభ్రపటీర వరమందారహీరతుషారమౌక్తిక నారనాథ సా సన్నిబసారకీర్తి విశారదాయని ॥హార॥ అంచితాగానాము సేయుచు ॥ తాంబూరచే వాయించిమీపాటలుబాడుచు । కాంచనాచేలముగొప్పకన్నులుమీసుందరాముగావించిఆనందించి సంతోషించుచు మీచెంతనిలచి ॥హా॥ శ్రీరఘునస కాశకేశవ ॥రా॥ కామచర్లవాస చిద్విలాసమాధవావాసిగా నేత్రోత్సవంబుజేసుక నామానసంచు భాసురంబుగాను వెంకటదాసునిచే బూనిమంగళ ॥హారతు

క॥ నిగమోక్తమంత్రపుష్పము ♦ తగనొసగుచునాత్మలోపదక్షిణములుచాలగజేసిటక్తియుక్తం ♦ బుగసుసమస్కృతులుసేయబూనితి రామా

కీర్తన ప్రదక్షిణం—ఆటతాళం.

మొక్కెదనయ్యా రాఘవనీకు దక్కెదవయ్యా ॥ప॥ మొక్కెదనయ్యానాదిక్కు నీవనినమ్మిగక్కునమీపాదకమలయుగ్మములకు ॥మొ। యిరవందగాను నామదిలోన వరభక్తితోను ॥ కరములుచరణములురము భుజంబులు శిరమాదిగనుభూమినొందియ జాగిలినొంది ।మొ। యెడలేనిదయనూ రాఘవనన్ను యెడబాయకికనూ ॥ తడవింతలేక ప్రదక్షిణములుచే

సి కడునూరువేలులక్షలుకోటులుగాను ॥మ్రొ॥ తెలిపీచెనిలచీ రాకమచర్ల నిలయూనిదలచీ ॥ సలలితానందబాష్పములచేతనుమేనుపులకించగనుచిత్త చలనము తయులేక ॥మ్రొ॥

క॥ వరశ్వేతచ్ఛత్రంబును ♦ యిరవుగచామరమునృత్య మేర్పడగీతం
బరయగముకురమునిడి ♦ పరచయములుగావింతునీకు సీతారామా-

కీర్తన రాజోపచారం—ఆదితాళం

రాజోపచారములొనరించెదనూ । శ్రీరామచంద్ర ॥ రాజోపచార ములొనరించెదనూ ॥ప। రాజోపచారనిరత రాజోపమానబవ్య తేజామిమ్ము లమహారాజావనుచుగొలుతు । రాజితమణిహారా ॥ వరవిభ్రాజితకోటిరా। యోగిసమాజహృద్విహారా ॥ భువిజనపూజితపదయగ పున్నాగణ్యాదినరా జకులోద్భవరమ్యాబరణా ।రా॥ దడువేడ్క మీరు కొలువయ్యుండ । వా మాంకమున పుడమికన్నె యగూరుచుండా ముందరహనుమంతుడు చేతులె త్తియుమొక్కుచుండా ॥ ముదమొప్పచుండ కుడినా యెడ మానకయిన కొడుకు శత్రుఘ్నుడూనువిడకా ॥ వేసకలత్మ్యణుడు మోద మొందుచునుండ అడరవిభిషణుడు। జాంబవదాంగరవిసుతుడు। గొప్పగునెడవశిష్టగురుడూమి మ్ముతినెడబాయక నా ల్గడలవెలయనీకడనుబంగరవుగొడుగుబట్టుకొని ॥రా॥ సురలుపురుషులుపరిమేష్టింపా ॥ గొప్పబుధవరులు మీకథలున్గడింపా॥ వంది మాగధులు కరములెత్తుచునన్నునుంపా । వరకవిగాయక ప్రవరులుమీసేవ వరులుపరికింపగాను తమపనులు సేయుచుండ మురసిమిమ్మునగందు । దేవర చరితమెల్లవిందు । చెప్పిన తెరగులు గైకొందు॥ యిరువుగ మీముందరపుకు రంబిడి కరమునవిజామరమునుబూనుక ।రా॥ సరసు లెల్లానుమెచ్చమెచ్చగాను వెంకటదాసుచరణమీస్మరణశాయగాను । సంగీతరాగసరళిచె మిమ్ముపా గడెదనూ । బహుమెప్పుగాను వరవీణెతంతువులుమందర మధ్యతారకము లు । నారయకళ్యాణీ నీలాంబరభైరవిసావేరి । మరిమోహనవాట పూరి మాళవిజంఝూటి । ధన్యాసరివరాళిసురట।లరయగసరిగమ పధనిస్సనిధప మగరి స్వరముల మరియింపలరగ బాడుచు ॥రా। ప్రకటించినర్తన జేసెద నూ ॥ జల్లుగలూనపదమూలగజ్జలు మోగియగాను ॥తాళమృదంగసకల వా యిద్యమెప్పగాను ॥ బహుమెప్పుగాను ॥అకలంకమైనసేవలన్నియుజేసెద

మీాసేవకూడరాకమచర్లవాసానన్నేలరయ్య ॥ సకలలోకపాల । బుధజన సన్నుతమునిజాల ॥దేవాద్యఖిలమానిలోల। ప్రకటితభరతప్రకరక్రమమున ధృకిట ధృకిటతోం-తధి తెయ్యని ॥రా॥

కీర్తన ఆనందం—ఆదితాళం.

ఎంతచక్కనిదేవుడమ్మ । శ్రీకాంతునిగనుగొనరమ్మా ॥ప॥ సంతత మునునర్వసమ్మతైనవాడు । మంతానమునచాల మమతదలిగినవాడు । వింతాగశ్రీదేవి కాంతుడైనవాడు । శాంతమానసమున జగముఃలేలెటి వాడు ॥ఎం॥ రంజితమృదుపాదమంజీరములవాడు । కంజాతములరీతి కన్ను లుగలవాడు । మంజులమృదుతరమధురాధరమువాడు । సంజీవముగ భక్త సంఘామేలెటివాడు ॥ఎం॥ సిరిగుల్కుబంగారు చేలాముగలవాడు । ఉరమం దుముత్యాలసరులుగలిగినవాడు । కరయుగ్మశంఖుచక్రము గలిగినవాడు । సురలునతించెటి సొగసువన్నెకాడు ॥ఎం॥ చిన్నివెన్నెలరీతి చిరునవ్వు గల వాడు । పున్నమచందురుబోలు మోమువాడు । ఎన్నికైనసీలపన్నె దేహ మువాడు । కన్నులపండుగాచున్న శ్రీరమణువాడు ॥ఎం॥ గంటభాగములందు కుండలంబులవాడు । దండికిరీటముఃతలమీాదగలవాడు । అండబాయక మో ములందునుండెటివాడు । నిండువెంకటదాసునేలినదయవాడు ॥ఎం॥

కీర్తన ఆనందం—ఆటతాళం.

దొరలకెల్లానుదొరగదవమ్మ॥ మారామచంద్రులు । దొరల ॥ప॥ పరసిజభవభవసురనాయకదినమణిశశిధరనరవరులాదిగగల ॥దొర॥ యితరులుపాటిరారోయమ్మ । సకలాత్మలానుసతతాముబ్రోచుచుండునమ్మ॥ శతక్రతువులును వ్రతములుధార్మికహితులైబుధసమ్మతముగజేసెటి ॥దొ॥ కోటిభానుప్రకాశుడమ్మ । సుషుమ్నబిందు త్రికూటమధ్యప్రదేశుడమ్మ—హాటకవర్ణ సహాయసుషిరహృత్కేడమార్గదీక్షితయోగాస్పద ॥దొ॥ పరమానందాకారరూపుడమ్మ । మహితవైకుంటపురమందువెలయుచుండునమ్మ॥ హరిపదసరసిజపరమమందస్ఫురితరసామృత పరవశమతులకు ॥దొ॥ దాసాభిమానరతుడోయమ్మ । నిగమాగమేతి హాసాపౌరాణవర్తనుడమ్మ । వాసిగభక్తులదాసిచాలదయ।జేసెటిరాకమచర్లగిరీశుడు ॥దొర॥

క॥ వరహంసతూలికంబున ♦ కరమొప్పగ విరులపాన్పు గలశయ్యనుసుం
దరమైనసీతతోడుత ♦ యిరవందగ పవ్వళించు మికశ్రీరామా.

కీర్తన సుషుప్తి—ఆటతాళం.

నిదురించవె రాఘవా । మహానుభావ । నిదురించవె రాఘవా ।ప। నిదురించు మీపాన్పునందు మరువైనలోకాము లదరనివ్వక బ్రోచె యాలపాట దీరగ ।ని। జెటకీనవారాలనూ। చాలగసుండె జెదరినదీనులనూ । పేదరికము బాదపీనసుజనులనూ । మీకథలెల్లజదివేటిసరసులను వదలాక మీపాదపద్మముల సేవ మదిలోననమ్మి సమ్మతిమొందువారల । సదయహృదయుడవగుచుగనుగొని కోదువలెల్లనుదీర్చి బహుసంపదలు సుఖములునొదవ నొసగినబడలికలు బాయంగనేడు ।ని॥ చెలగిబంగరుమేడను రత్నములు మిక్కిలికాంతులొనగూడను । నిలువుటద్దములు నాల్గుదిశలందును । మణులదీపములు చాలవెలుగగనూ । వెలలేనితూగుటుయ్యాలను పచ్చల కాంతిదీలకింపగను హంసతూలికాతల్పమునందు । చలువమైనసుందరముగనగుచును తెలివిగలిగియుదవళవర్ణంబులను విలసితములగుమల్లె విరులపానుపునందునించుక ॥ని జగతీచేడెలెంచగా । జల్తరుపూల చీరశృంగారించుకా। ముత్యాలరవికె సొగసుగధరియించుకా । మించినకాంతినిగడుసొమ్ములుబెట్టుకా । అగణితవైబవముగుచు ధగధగధగితకాంతులతోడ దనరుసీతనుగూడి । మిగులముచ్చటలాడుచును కడుమేలమరగమంచికుంకుమ అగరుమరిజవ్వాజి గంధమునందుకొని సంతోష మొందుచు ॥ని॥ సరస సల్లాపములు దేనరవారికిరవైన వేడుకలూ । మెప్పుగజక్క విరులదండల బంతులూ । తురాయిలుపరిమేళ్ద్రవ్యములు । మరిమరిమీలోన మనసు రంజిల్లాగ సరస రాకమచర్లహరివయ్యిమురయుచు । పరగపరిరంబణములాదిగ జరుపుచును సుఖలీల దేలుచుసురతబ్రహ్మానంద మొందవెదరణివెంకటదాసపాలనా॥ని॥

క॥ లాలీరఘునందన ♦ లాలీపూర్ణేందువదన లాలిమహాత్మా
లాలీనిరుపమసుందర ♦ లాలీవైకుంటధామ రాఘవరామా

లాలిపాట—ఆటతాళం

నాచిన్నకృష్ణమ్మ నవమన్మధాకార - లాలిలాలీ।శోచక్రదరపద్మలో

చననశ్వేశా లాలిలాలి ॥ప॥ చిన్నారి పొన్నారినన్నుగన్న స్వామిలాలిలాలీ॥ వన్నెగుల్కుస్వామివయ్యారిరంగయ్యలాలిలాలీ ॥నా॥ నగుమోముగలస్వామి నారాయణాచ్యుత లాలిలాలీ। నిగమపన్నుతపాద నీరాజలోచనలాలి లాలీ ॥నా॥ జగదేకవీరముజ్జగవరిపాలక లాలిలాలీ ॥ అగణితవైభవ ఆనంద దాయక లాలిలాలీ ॥నా॥ కొంగుబంగారమాకొసరుమాణిక్యామలాలిలాలీ। రంగురంగులచిల్క రాజీవలోచన లాలిలాలీ ॥నా॥ పరమపావనలోక భరితదయాకర లాలిలాలీ ॥ నిత్యసరసరాకమచర్ల స్వామి వాసుదేవ లాలీలాలి ॥నాచిన్ని ॥

క॥ జోజో శ్రీనారాయణ ♦ జోజో శ్రీవాసుదేవ జోజో కృష్ణా
జోజోనిరుపమసుందర ♦ జోజో వైకుంటదామ జోజో – రామా.

జోలపాట—ఆటతాళం.

రామకృష్ణజోజో । రామచంద్రజోజో ॥ప॥ స్వామిమాధవగోవిందజానకీశజోజో ॥రా॥ సుందరాంగజోజో । సుప్రసాదజోజో । యిందునిబాస భవ్యమందహాసజోజో ॥రా॥ పరమపురుషజోజో బక్తవరదజోజో నరసింహాచ్యుతశ్రీమన్నారాయణజోజో ॥రా॥ దాసపాలజోజో । దర్మశీలజోజో । వాసవసన్నుతనామ వాసుదేవజోజో ॥రా॥ దురితదూరజోజో ॥ నిరతిశయనజోజో చిరతరాసంతోష రాకమచర్లనిలయజోజో ॥రామ॥

క॥ శ్రీకరమానసపూజయు ♦ పాకటముగ జేయునట్టి భవ్యాత్ములకున్
చేకురుసుమదీప్సితములు ♦ రాకమచర్లాదిస్వామి రక్షించుదయన్ ॥

—♦ గద్య ♦—

ఇది శ్రీవత్సకౌస్తుభకటక కేయూర కిరీటకుండల గ్రైవేయక తారహారావళీనందక కౌమోదక పాంచజన్యసుదర్శనాద్యాయుధ దివ్యమంగళవిగ్రహుండును గరుడధ్వజుండును వైకుంఠ నిలయుండును నగు శ్రీవాసుదేవ పరబ్రహ్మపాదారవింద సేవాదురీణుండును పరమభాగవతోత్తముండును నగు శ్రీమద్రాకమచర్ల నివాస వెంకట దాసార్యుల కీర్తనలు మానసపూజ బగవదర్పితముగాను లిఖత్వా.

శ్రీరస్తు.

శ్రీరాధా రుక్మిణి సత్యభామ సమేత

శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః

# రాకమచర్ల

# వెంకటదాసుగారి కీర్తనలు

## గురుస్తవ కీర్తన—ఆటతాళం

గురుదేవతానందమూర్తి - భక్తకోటిమానస చక్రవర్తి ॥ప॥ వర యోగిజీవనవరహితకారణ నిరతిశయనసర్వ దురితనివారణ ॥గు॥ హరిహర బ్రహ్మాదిరూపా - వరమోదార సుగుణప్రతాపా -సరసవేదాంతార్థషట్చక్రసంచార గురుతరనిరతిత్రికూటసంచారక ॥గు॥ బిందునాదాదివినోదా- బ్రహ్మానందసంతతసుప్రసాదా - యిందుహిరణ్మయ మందిరత్రైగుణ్య సందేహవర్జిత సరసిజనార్దన ॥గు॥ పండిత బృందవిహారా - త్రిమండలలక్ష్యవిచారా - కుండలిగర్భహృత్పుండరీకవాస - దండి తేజోమయమండలవ్యాపక ॥గు॥ జీవాభిమానవిదూరా - భక్తచింతితఫలదగంభిరా - దేవదేవసర్వదీనాదయాపర సేవకావన రాకమచర్ల శ్రీహరివీర ॥గురుదేవ॥

## కీర్తనానామం—ఏకతాళం

గురువీరాయతెనమోనమో - శ్రీగురువీరాయతె నమో ॥ప॥ఆగమ తత్వవిచారత్రికూటవిహార సమస్తాధారకృపాకర ॥గురు॥ సంతోషచరిత నిరంతరవైభవ చింతత ఫలదా సేవక జీవన ॥గు॥ కారణసంచిత దూరభవాంబుధి తారకసద్గుణ ధామసుఖాస్పద ॥గు॥ పరమపావనలోక భరిత బ్రహ్మానందచరిత నిరంతరదురితనివారణ ॥గు॥ మంగళప్రదసుప్రసంగసమంచిత । శృంగారరూప నీలాంగపట్టణవాస ॥గురు॥

## మనోబోధ కీర్తన—ఆటతాళం

యీవేళనా ప్రాణజీవనమగు వాసుదేవునిరమ్మనవె ॥ప॥ భావించి వానికి బంటనయ్యున్నాను గావుమనుచు దెల్పగదవే వోమనసా ॥యీ॥ నమ్మినమాటకు ననుబ్రోవమనివాని సమ్మతిగాజేయవే । పొమ్మవేగ

మెనికరమ్మాగ దయతోడ రమ్మానివల్కవేరాజీవనయనూని ॥యీ॥ పాపిష్ఠియీమాయప్రారబ్ధమునజిక్కివోపజాలననవె - తాపాముదీరగ తనపాదములుకండ్లజూప్పట షేలానవెవోమనసా ॥యీ॥ కొంచముగాననట్టి మంచిచిత్తముముందె లంచమిచ్చితినానవె। కాంచనాంబరుడు రాకమచర్లనిలయూడుపంచావశాయదలంచెనేమిసేతు ॥యి॥

కీర్తన ఆవాహానం—ఆటతాళం.

రామప్పరారా మాయప్పరారా॥ప॥ రామప్పనీముద్దుమోముకన్నులజూపు నామనోహరజగన్నాయకశ్రీపతే ॥రా॥ జాలిజెందితినిౘక తాళవశముగాదు నీలవర్ణనీజోలిచిత్తమునాట ॥రా॥ దిగులొందియున్నరేబగలునిన్నుదలచి జగదేకవీర నీచిత్తముగరు గాదు ॥రా॥ నేడుమిమ్ములకండ్లజూడకున్ననోపవేడుకతో నన్నుగూడవెనాతండ్రి ॥రా॥ అంగాజజనక సీతాంగనసంయుత పొంగుచునాయెదుట రంగు నిలువార ॥రా॥ కాంచనచేలముమించిదిపించాగ వేంజేయరా నిన్ను యెంచినుతించెద ॥రా॥ గోపాలనీరూపుజూపకనేనోప బాపురెనాచింత బాపరనాతండ్రి ॥రా॥ కమలాక్షనన్నొక్క ఘుడిమైచవిడువకు సుమహితవైభవ సుభగచరితహరె ॥రా॥ వప్పగనేడు మీగొప్పకన్నులదయ గుప్పారనాతండ్రి చెప్పయెవ్వరితోను ॥రా॥ పసిడిగిన్నెలోన మిసిరిమీగడపాలు కొనరిఅందిచ్చెద కోరిత్రావుదుగాని ॥రా॥ గజ్జెలందెలుకాల్ల ఘల్లనమ్రోయగ ముజ్జగములబ్రోచె మోహానరూపక ॥రా॥ సద్దయహృదయనాకొదువలెన్నగబోకు మదిలోనమీమృదపదపద్మములుదలతు ॥రా॥ యీపొద్దునీదయజూపకున్న మదికోపతరముగాదు నీపాదములసాక్షి ॥రా॥ వోచక్రిధరపద్మలోచననేనిన్ను జూచిమతించెద నాచిత్తమున నేడు ॥రా॥ భవనాశనాపూర్వ భవములు దొలగగ సవిశేషముగజోలిచెవిలోనదెల్పవె ॥రా॥ మక్కువతోనొక్క మనవిజేసెద నేడు ॥ చక్కానిక్రుష్ణనన్నక్కరతోజూడు ॥రా॥ పరుడగానికనీదు చరణయుగ్మమునందు । మరిగియున్నదినామనసుదెలియరార ॥రా॥ సాధుపన్నములోన భేదమేమిలేదు । నాదుభాగ్యమని నమ్మియున్ననింక ॥రా॥ మందహాసముమోముసందునందడిజెంద యిందాకరారనీవందాసుడనుచును ॥రా॥ కడువేడ్కతోనన్ను యెడబాయకురయింక । తడవుశాయకఃల్కు తమ

శాపములుదీర ॥రా॥ పుల్లాసముగ జగమెల్ల కొల్లలూగ చెల్లాగమీకథలెల్ల భజించెద ॥రా॥ వింటిమీసత్కథ కంటిమీనగుమోము ॥ తొంటికర్మముచాయగంటిమినేడు శ్రీ ॥రా॥ కలితరాకమచర్లనిలయనీసాక్షిగా పలికితె దేహము పులకరింపుచునుండు ॥రా॥ ధరణి వెంకటదాసు నిరతము నీనామస్మరణజేయుచునుండు కరుణజూడవెతండ్రి ॥రా॥

కీర్తన—ఆదితాళం.

వో రామానమ్మినవాడనె॥ శ్రీరామానమ్మినవాడనె ॥ప॥ రామరామహిమధామసమానస నామనోహరనారాయణహరి॥వో॥అరమరలేదని పరిపరివిధముల శరణంటిని అక్కరజూడవుగదె ॥వో॥ సుచరితసేవకనిచయాస్పదసద్వచన నిరంతరఖచరాధిపనుత॥వో॥సారవిహీనవికారదుష్టసంసారసాగరముభారమాయెగదె ॥వో॥ నీయెడనేమియుపాయముదోచదు కాయముసీదని కడునమ్మితిగదె ॥వో॥ చలమువలదునత్ఫలమొసగవెనిను దలచెద పలుమరు నలినదళేక్షణ ॥వో॥ శ్రీకరరాకమచర్లనిలయకరుణాకరనీకృపకాశించితిగదె ॥వో॥

కీర్తన—ఆదితాళం.

తరమానినుమదిదలచిపొగడగను దశరథరామధరణి ॥ప॥ శరణనువారలకోరములొసగుచును । భరియింపగనీసరియింకెవ్వరు ।నవరరేణ్యాదేవాధరణిజనాథసత్ప్రభావ । నీపదసరసిజయుగళము మరుగువజేరితి । మరువకదాసునికరుణజూడుమిక ॥త॥ పగవారైనను ప్రణుతిశా... పగజూచెదవూ। తెగపుల్తోడనినుబొగడినవారలదరిలిచరించెదవూ వదలకనగమాదులుశేలగలునిన్ను ముజ్జగరక్షకుడనిసన్నుతిజేతురుసుగుణశాంతహృదయాసేవకశుభకరసద్వినయామరిమేలగుననినామదితగుననికోరితినగ...శేఖరసరోత్తమ ॥త॥ గురుదయాశాలివిగొప్పదాతవని కోరిభజించెదనూ।పరులనువేడనుభావములోనినుప్రస్తుతిజేసెదనూ। వరహితవరసుందరముని మోహితచరణయుగళసురసేవితసంతతపరమపుణ్యశీలా। శ్రీకరభక్తహృదయఖేలా॥ శోభితగరుడగమనరాకమచర్లాధిప కరుణాకరవెంకటదాసావన ॥త॥

కీర్తన—ఆదితాళం.

సాగ నైననగు మోముజూపరా। చాలదిగులు జెందితిచింత బావరా ॥ప॥ పగలు రాతురులనక మిము వేపలు కరించినగాని నీమది తెగువ లేశము లేదు నీద యతెలిసెనిక నేమిసేయుదు ॥సా॥ తలచగనాతో డవాదమా। నీదాసుడనా యపరాధమా। తెలిసితెలియనివానివలె నావలనచులుకదనంబుజూడకు సల లితంబుగ నీదు నామస్మరణజీవనమనుచు నమ్మితి ॥సా॥ వంచనశాయపనేమినెన రుంచినన్నేలు నాస్వామి। మంచిదాతవటంచు నిన్ను దలంచి వేడు టెగాంచి నీమ దికొంచమైన సహించి బోచి వదలంచ వేడు విరించిసన్నుత ॥సా॥ తప్పులెన్నగదొ డ్డతనమా-బహుదయగలదొరవని వినమా అప్పటప్పటికనుచు ఆశలదిప్పి చప్పుదనంబు శాంచుకు గొప్పకార్యము కాదు నీదయ గుప్పి తేగొదు వేమి లేదిక ॥సా॥ శరణాని వేడుచున్నాను - రాకమచర్లావాసుని సాక్షిగానూ - తరచు దీనులబోచిన చరితములు మది మరిగి యీకథలరసి సన్నుతి జేసితిని కరివరద వెం కటదాసపోషక ॥సాగ॥

కీర్తన—ఏకతాళం.

బాలం ముకుందం పరమానందం ॥ప॥ బాలం భక్తజనలోలం పండితహృ త్ఖేలం మానీంద్రమతిపాలం గోపాలం ॥బా॥ శూరం ఆశ్రితపరివారం వేదాంత సంచారం ప్రణతౌఘమందారం గోపాలం ॥బా॥ శౌర్యం సద్ధర్మి కౌదార్యం స తతచాతుర్యం శరధిగంభీర్యం గోపాలం ॥బా॥ శ్రీశం రాకమచర్లవాసం కమ లాప్తసంకాశం సతతజగదీశం గోపాల ॥బాలం॥

కీర్తన—జంపెతాళ.

రామనారాయణ రామనారాయణ రామ శ్రీవైకుంఠధామనారాయ ణ॥ప॥ వామనశ్రీధరవసుదేవనందన కామితార్థప్రదాస్వామినారాయణ॥రా॥ రక్షితాఖిలమహాద్యక్షరూపాక్ష నుతరక్షించవయ్య ప్రత్యక్ష నారాయణ। ॥రా॥ సుందరాకార గోవిందపరమానంద -నందనందన చిదానంద నారాయణ ॥రా॥ యిందిరాహృదయారవిందసంచార ముచుకుందరక్షక మహానందనా రాయణ ॥రా॥ అంగుళా నాయంతరంగంబు లోపలను పొంగుచునుదలతు సుప్తాంగి నారాయణ ॥రా॥ తరితీపులెల్లమీ చరణయుగ్మము గోరమరిగితి నినాకేమి తెరగు నారాయణ ॥రా॥ అంటరానీవు నాజంటరా నేను నీ జంటరా

వినుత ముక్కంటినారాయణ ॥రా॥ లేదురానీదయయేదిరానామీదయా దిలేదాయుసమ్మోహదనారాయణ ॥రా॥ తల్లిదండ్రినిగురుడనెల్లలోకములం దుచల్లగా బొగడనేజెల్లనారాయణ ॥రా॥ హనురాగముతోనుపూనిమీనామముల్ ధ్యానమొనరింతు సుజ్ఞాననారాయణ ॥రా॥ పాపాత్ముకుడ కుటిల వ్యాపారమతుడనుచు కోపగించకను దయజూపునారాయణ ॥రా॥ మంద బుద్ధుడనామనసునిల్పగలేను।యిందీవరాక్షనీయందునారాయణ।రాదుర్మ తాత్ముడమహాతూర్యుడను నాపూర్వకర్మములబోదోలగదవెనారాయణ॥ రా॥ వరసుందరాకార చిరభక్తసంచార। కరుణసారగ లక్ష్మీకాంత నారా యణ ॥రా॥ పాపపుంజములోనవోపజాలగదయ్య। బాపురెనాచింతబాపు నారాయణ ॥రా॥ రాజీవనేత్రవిభ్రాజమానకిరీట రాజితైశ్వర్యమహా రాజనారాయణ ॥రా॥ శృంగారవేషభవభంగసంగర।విజయ సంగీతలోల శ్రీరంగనారాయణ ॥రా॥ మంగళాంగదమానిపుంగవార్చితపాద ఆంగజా హితదనుర్భంగనారాయణ ॥రా॥ శ్రీకరాకార సురలోక సంచార వరపాక శాసన వినుతభవ్యనారాయణ ॥రా॥ నర్వేందువదనరిపు గర్వపరిహారజనని ర్వాహకత్వంత విప్రునారాయణ ॥రా॥ వనజాక్షసర్వేశ వాసుదేవముకుం దసనకాది వినుతసద్గుణయు నారాయణ ॥రా॥ బ్రహ్మాదులైననిను ప్రస్తు తించగలేరు దుర్మదునినాకేమిదోచునారాయణ ॥రా॥ రక్షింపురక్షింపు పే క్షశాయకునాతో। కక్షజేసితెయేమి గలుగు నారాయణ ॥రా॥ పరిపూర్ణ లోకసంభరితుడనీవనే। శరణుజేసెదనిరాధరుడ నారాయణ ॥రా॥ రాజవ దనసురేశ రమ్యసుందరవేష। వోజగజ్జనకల్పభూజ నారాయణ ॥రా॥ మే లుగామీకున్నలీలలెన్నుచు భక్తినోలలాడుదునుగోపాలనారాయణ ॥రా॥ యింపుతోవీణ వాయింపుచునుచాలనుతియింపగోరితిని బ్రోపెంపు నారాయ ణ ॥పోషితాఖిలభవ్యవేషమితభాషగతదోషనుగిశేష మణిభూష నారా యణ ॥రా॥ కన్నరానీకరుణ విన్నరానీకీర్తననెన్నవయ్యమాయన్న నారా యణ ॥రా॥ లేరుమీతోసమము రారుయెవ్వారైన నీరదాకార ననుజేరు నారాయణ।రా॥అంభోజనాభదితి సంభూతపరిహార జంభారివినుతసంరంభ నారాయణ ॥రా॥ హరిహాటీయనినిన్ను కరమొప్పనెబిల్వబిరబిరనురావెకరి వరద నారాయణ ॥రా॥ నిద్దంపుచెకిళ్ళు ముద్దుగనుమెరయ నావద్దకినిరావె

యీపాప్రొద్దు నారాయణ ॥రా॥ గండమండలమందు కుండలంబులు గదులు చుండగూర్చుండు నాదండ నారాయణ ॥రా॥ నిగనిగమని మెరయుచును వగగులుకు నీముద్దునగుమోము జూపుసొంపుగను నారాయణ ॥రా॥ కనుగొందునయ్య నాకనులపండువుగాను వనజాక్షనీవైభవంబు నారాయణ ॥రా॥ తోడురా నాజతను గూడురా నేను నీవాడ రావరులగోని యూడ నారాయణ ॥రా॥ యెన్ని విధములనైన నవన్నె నమ్మితినయ్య నన్ను తామంసుప్రసన్న నారాయణ ॥రా॥ పలుకుపలుకుకు ముద్దులొల్కగా నాతోడ పల్కరించగదయ్య: లికినారాయణ ॥రా॥ నీయధీనమటంచు నెరనమ్మియున్నాను యేయుపాయము జెప్పవేమి నారాయణ ॥రా॥ డాయరావే గకృపశాయరా । నిన్ను యెడబాయరా నిరతసదుపాయ నారాయణ॥ రా॥ అన్నరావరసుప్రసన్న రానన్నేలుమన్న రాముండనను గన్న నారాయణ ॥రా॥ మొదనందు శ్రీదేవి బాదలిసంతోషింపముద మొందిమాటాడగదవె నారాయణ ॥రా॥ నీసుందరాంగంబు దాసునికి దయతోడ వాసిజూపు ధరహాస నారాయణ ॥రా॥ కంటినీ నగుమోము కంటినీవాదముల్తొంటికర్మము బాము గంటి నారాయణ ॥రా॥ దండిగా నీకు నేదండమర్పించెదను అండబాయకవద్ద నుండు నారాయణ ॥రా॥ శరణు శరణిదె నీకు శరణాగతత్రాణ బిరుదులు గలదొడ్డదొరవు నారాయణ ॥రా॥ పాహి నాహ్యానినిన్ను పలుమారు బిలిచెనను దేహి దేహి కృతాం దేహి నారాయణ ॥రా॥ ధర్మసాక్షిగ నిన్ను దలచెదను నాపూర్వకర్మముల బోదోలగద్దవే నారాయణ ॥రా॥ కోరగా నిన రుడ నక్కరజూడు నీకింత బరువాయెనా దయాపరుడ నారాయణ రా కేశవాచ్యుత మహోల్లాస రాకమచర్లవాస వెంకటదాసవరద నారాయణ ॥రామ॥

## కీర్తన—ఆటతాలం

ఆర్తరక్షక నిన్ను నమ్ముక మీనామకీర్తన జెసెద నోరామ ॥ప॥ నేర్తునో నేరానో నిన్ను నమ్మినాను కీర్తినీదె అపకీర్తి నిదెసుమ్మి ॥అ॥ జగదేకవీరము జ్జగముల మీకీర్తి బొగడుచునుండెద నోరామ అగణిత వైబవ మగునీదు నగుమోము మిగుల నేపుంచి శేబగలు సన్నుతింతు ॥అ॥ నమ్మితి నావెంటరమ్మని చెయ్యెత్తి ముమ్మారు బిలచెద నోరామ సమ్మతితోను కరమ్ము గనన్నేలుమ్మని శ్చయముగ సుందరరూపక ॥అ॥ నిక్షేపముగ జనులరక్షింతువని

నీ సాక్షి చాటించదనోరామ । ఆశ్రయకరుణా కటాక్షవీక్షణ పక్షించరావా హనపరమదయాకర ॥అ॥ నరసరాకమచర్ల స్వామివనుచు లెన్న మురయు చునిసుగండునోమ ॥ ధర ణిలో వెంకటదాసుడవనినిన్ను మరిగితి నిజముగ మరిసంశయము లేదు ॥అ॥

## కీర్తన—ఆదితాళం.

గోపాలకనాపాపమునన్నక చూపవెనీకరుణా ।ప। శ్రీపరమేశ్వర సేవక జీవననీపదపద్మముప్రాపనినమ్మితి । శ్రీపరమేశహారెసదామునినేవిత దురితారె । నిరంతర తాపసవినుతకలాపధార్మికా టోపయదుకులోద్దీపర మాధివ ।గో॥ అనుదినమునునిన్ననుసరింతు దాసునినసుబ్రోవగదె - తన య నిననుబ్రోచితె సౌభాగ్యముతక్కువగాదుగదె వినవెనామొరవిస్తరిం పక దినదినమునువంచనశాయకునా - ఘనుడనీవెకా - మొక్కెద కరు ణ నేలుకోవె - మీపదవనజమ్ములు నామనమున దలచితివనజదళేక్షశ్రీవా సుదేవహరె ।గో। వరములొసగు శ్రీకరరూపకనీచరితమెపొగడెదనూ-పరు డగానుయాదరమునజూపవెవిర హేతుకుడానూ - నీచపునరుడననుచునన్న రమరశాయకు వరివరివిధముల వరుడగానునను - మరుపననుచుబలుకూ సారెకుకరుణచాలజిలుకూ- నీకతధరణిలోపలను దాసులతోడుత నెరి ర- హస్యమును నేవినిపించెద॥గో॥ శ్రీపతిచిత్తవిలాసపరాత్పరవాసవనుతనామా భాసురనిగమాభ్యానజనార్దన భవ్యసుగునధామా - దానజవార్తివినాశవ ఘనసంకాశకలితరాకమచర్లాధిప - వాసవిసారథ్యా కాంచన వననసురారా ధ్యా ॥ నిరతమదాసుల హరనరాసన శౌర్యోల్లాస సకలలోకేశ దయా వర ।గో।

## కీర్తన—అటతాళం.

నందానందనకృష్ణ నవనీతచోరా -మందారధరదివ్యమణిమయహా రా ।ప। యిందువదనశరదిందీవరేక్షన వందితవరసంక్రందవనందన ।నంద। దివ్యాసుందరవేషా దీనాఘపోషా - భవ్యకాంచచేలా పరమునిశేషా । అవ్యయతేరబ్రహ్మవందాచ్యుత - వ్యవరుచితరరత్నాంచితభూష ।నం॥ కం కాణ కేయూరమణిమయాభరణా । కింకిణిమంజీరఅంకితచరణా పంకజ. భ

వనుతభావవిలక్షణ శంకరహృదయవశంకరసజ్జన ॥నంద॥ పరసుశాంతనిరూఢా భక్త్యాశరణ్యా । గరుడవాహనదివ్యాకలిత్రపాపిణ్యా । మురహరి పావవిమోచనశ్రీధర । గిరివరసుతరాకమచర్లాధిప ॥నంద॥

కీర్తన—ఆటతాళం.

ఓరఘునాయకా ॥ శ్రీరఘునాయకా ॥ప॥ రఘునాయకశ్రితరంజితసద్గుణ । అఘదూరవరశరణాగతరక్షణ ॥ర॥ కల్యాణగుణకౌసల్యకుమారఅహల్యారక్ష బ్రహ్మానందమానస ॥ర॥ సవిశేషమకౌశికసవనరక్షనదేవ ॥ అవిరళహృదయసదానంద తేజశ్రీ ॥ర॥ తాటకాంతకశౌర్యధరణీసువార్చితకోటిభానుతేజ గురుజనపరిపోషా ॥ర॥ సుగ్రీవాగ్రహ అనుగ్రహాపరమానుగ్రహశ్రీభరతాగ్రజనరవర ॥ర॥ దశకంధరానుజ హైత్రశ్రీదాయక రసికమనోహర రాజకులోత్తమ ॥ర॥ జలధిబంధనశతృదళితశాపన విలసితమణ్మౌఖలలితపరాక్రమ ॥ర॥ రావణపర్వతదేవ వజ్రాయుధ । పావనరూప సంభరితజగన్మండశ్రీ ॥ర॥ నీకంటెదొరలుముల్లోకమందునలేరు లోకనాయకబుద్దిలోననీవేసాక్షి ॥ర॥ నిన్నుమెప్పింపాగ నేరనెంతటివాడ నిన్నురక్షించార నరుడనీచుడాను ॥ర॥ జ్ఞానహీనుడాను గర్వపరుండాను మానాభిమానమమరినీదెయనుకున్న ॥ర॥ అమరాధినాథనన్నరసిరక్షింపాగనమయమైయున్నాదికమలదళేక్షణ ॥ర॥ రమ్మిరమ్మియేలుకొమ్మి నీవాడనుసుమ్మినామనవిచేకొమ్మిదీనుడాను ॥ర॥ ఘల్లుఘల్లుమానిగజ్జెలందెలుమ్రోయ । వుల్లాసమునవద్దనుండారనాతండ్రి ॥ర॥ చూడుచూడుకృపజూడుమన్నవాడను । లోడనీడనినమ్మినాడనిక్కముగాను ॥ర॥ బ్రహ్మాదిసేవితపావనచరితచిద్బ్రహ్మస్వరూపక సండితనుతనామ ॥ర॥ గురుతరవైభవ కువలయపాలనా ॥ అరవిందనాభశ్రీఅయోధ్యసంచార ॥ర॥ ముద్దుముద్దులుగుల్క వద్దనిల్వర వక్కనుద్దిజెప్పెదనీలో నుందారరూపశ్రీ ॥ర॥ హాటకాంబర శరణాగతరక్షన । మాటిమాటికినిన్నుమరిగిమనసుజేర ॥ర॥ అయువెల్లవ్యర్థమాయెనునన్నెమిశాయదలచినావుజలజాతలోచన ॥ర॥ సేయరానితప్పుజేసితి క్షమసేయు। కాయుతీగెకువేరుగాదానుపించుమి ॥ర॥ చిల్లరసరులానుచేరానువేడగ । వుల్లాసములోనినున్నుభూహింపుచుండెద ॥ర॥ తొలగరాయునిగేరుసాగసెననగుమోముది

గుబ్బదీరగ ంబుదీనదయాకర ॥ర॥ తడవుచేయకదయ జూచకజతగూడు । క
డువేడ్కతోనున్న కౌగలించుకుందు ॥ర॥ కరుణించగలిగితెకవటమంతయు
లేక । బిరబిరరారనాదోరవచ్చెనకుందు ॥ర॥ బవబంధములచేతపరితాప
మాయను । అపనీకనిబుద్ధివినశత్వమెందెను ॥ర॥ అవనీశమదిలోన అను
మానమేటికి ॥ నవిశేశముగఁ గోలి చెవిలోనదెల్పర ॥ర॥ ఆగడాయె సంచీత
మనుబవించగనాయె జగదేకపిరసిచిత్రమెట్లున్నాదో ॥ర॥ దండిమామిడి
పండుపిండివేడుకతోడఖండ శ్కరతోను గల్పిఆర్పించెద ॥ర॥ బంగారుకొం
డావుపాణినాథుడావు । శృంగారవదననినుజూచి సంతోషింతు ॥ర॥ పలు
పంచదారమేలయినమీగడ । చాలదెప్పింతు చవిగొనునాస్వామి ॥ర॥ ఆ
టపాటలచేత అలసివున్నావేమో । పాటించినేడునీపాదములొత్తెద ॥ర॥ కం
టినిన్నునాకనులపండువుగాను బంటుఖంటునునాదుజంట బాయకుతండ్రి ॥ర॥
యిదెమంచిసమయము హితవుమీమదిలోన । ముదమొందగానొక్క ము
చ్చటదెల్పవే ॥ర॥ కాచిబ్రోచితివికరునజూచితిమీచిత్తమిక యేమిదోచదు
నీదయ ॥ర॥ మన్నించునాస్వామి మనసందుదయదల్చి । పొన్నపుష్పముల
చేపూజింతునేకొద్ది ॥ర॥ భవాబ్ధినయ్యాన్ని సిరతాముననుబ్రోవ ॥ నావ
రింపకున్న నవకీర్తనజేసు ॥ర॥ యెప్పాటికైనను తప్పకదయయుంచు ।
వప్పులకుప్పమాయప్పచక్కనితండ్రి ॥ర॥ అభిమానమ్మెది ఆశ్రయించుట
నాది । యిబరాజపరిపాల యిందిరమణిలోల ॥ర॥ మందిజేయునట్టి నింద
కోరువలేను । యెందాకబోవుదు యిందీవరేక్షణ ॥ర॥ కంటకహారనీదుకరున
జూపకున్న బంటుజేసినపని పతికిదప్పదుగద ॥ర॥ నీకన్ననాయందునెవరు
న్నవారెరి ॥ శ్రీకరచరిత నాచిత్తమెనీదయ ॥ర॥ శరణుశరణునన్నుమరువా
కుమీభక్త । వరదశ్రీహరినేగవైకుంటనాయక ॥ర॥ దండముదండాముతా
పనమందార । పుండరీకాక్షబ్రహ్మాండనాయకహరే ॥ర॥ శ్రీరస్తు విజయస్తు
స్థిరకీర్తిరస్తు నానేరము లేన్నాకునీరాజలోచన ॥ర॥ జయమస్తుశ్రీజయమస్తుజా
నకిప్రాపదయోశ । సంయుగునసంతయు నారాయణాచ్యుత ॥ర॥ ధరణివెంకట
దాసవరదమహాప్రభో — సరసరాకమచర్లస్వామి సీతారామ ॥ర॥ దేహిదే
హిసర్వదీనదయాపర — పాహిమోముల వాస పరమదయాకర ॥ర॥

కీర్తన—ఆటతాళం.

నందనందనూనిపాదములు - బ్రిహ్మానంద ఖిల పొందీన పాదము లు ।ప॥ అందాముగా మోద మందియీ వేళలో యిందీర సేవించుపాదాములుమా ॥నం॥ సరసులెన్నినన్న వేపాదములు । సర్వసమ్మతమైయున్న పాదామూలు । పురిటింటిలో పాలపొసగ దేవకి దేవి కర మొప్పగమతియించుపాదామూలుమా ।నం। సదయహృదయమైనపాదాములు - లోకసమ్మతమైయున్న పాదామెులు । ముదమొప్పయశోద. పొదిగీటిలో పాలకదసిలీలలుజూపు పాదాములుమా ।నం। ముల్లోకములబో్రిచుమీ పాదములు ॥ భక్తులెల్లసన్నుతించుపాదములు ॥ వుల్లాసమున వ్రేపల్లెనందునియింట ఘల్లుఘల్లుననాడు పాదాములుమా ।నం। ఎడలేకసిరులిచ్చు పాదాములు । సజ్జనులు సన్నుతించుపాదాములు । బడలివేడుకగొల్లబాలూలతోగూడితోడలపైజాచినపాదములుమా ॥నం। పండితావనమై పాదాములు । లోకపాలితమైయున్నపాదాములు గాండీవరథమెక్కి కౌరవకోటుల చెండాడివిహరించు పాదములుమా ।నం। పరమపావనమైనపాదములు । దాసపాలితమైయున్నపాదములు । కరమొప్పవైకుంటపురమందు శేషునివరియంకమునజూచు పాదాములుమా ॥నం। చూడసుందరమైన పాదాములు । పరమశోభితమైయున్నపాదాములు । వేడుకవ్రేపల్లెవెలదూలతోగూడిక్రీడసల్పిననీవేపాదాములుమా ।నం। చారుకోమలమైనపాదాములు నవసాగరయుతమైన పాదాములు నారదసనకసనందనాదులెల్ల కోరిభజించిన పాదాములు మా।నం। దాసజీవనమైనపాదాములు । చిద్విలాసమైయున్నావిపాదాములు । వాసిగమునుకంపదాసివంకలుచక్కజేసి వర్తిననీవెపాదములుమా ॥నం। అకలంకములైపాదాములు పారమానందకరమైన పాదాములు । ప్రకటించి కాలియ్యాఫణులయందుననిల్పి తకధిమ్మికిటలాడుపాదములుమా ।నం। పాటింపగరానిపాదములు పరమనాథులుసేవించుపాదములు। పేటియక్రూరుడునాటిగగొనిపోవనీటిలో జూపినపాదములుమా ॥నం॥ కలితమంజూమృదుపాదాములు । శుభజలజాయుతములైన పాదములు । వాలకలిశాంకుశలలితచతయవజలజరేఖలనొప్పుపాదములుమా ॥నం॥ స్థిరముగ నన్నేలు పాదాములు । రాకమచర్లనివాసునిపాదాములు ధలణిలో వెంకటదాసూనుమదిలోన నిరతాము సేవించు పాదములుమా ।నంద।

కీర్తన—ఆటతాళం.

పలుకరా-దయజల్కరా-నాయయ్యనాతో ॥పల్ల॥ అల్కశాయ
కమొలకనవ్వులుదొలుకుచుండెటి సొగసుమొగమున తలుకుతలుకునికలలు
గురియగ చిలుకపలుకులచిన్నకృష్ణ ॥పల్ల॥ విన్నరాదాతవన్నరా॥ నీకళలు
చాలగ విన్న। చిన్నివెన్నలకన్నమిక్కిలివన్నెలనుచును వున్నకళలనుగన్న
లేవగుమోమునందున వున్నతంబై వొప్పుచుండగ ।పల్ల। నేరరా నన్ను
జేరరా । సారెసారెకుచిత్తమున వేసారకను దయలూరనాజిత జేరికూరిమి
మీరహాయనిచారుసుందరసారసేక్షణ ।పల్ల। శరణురానిన్నుమరువ
రా మీపాదములకుశరణురా । పరమసుందర భవ్యశోభన్కర మహాత్మక
వరదయాకర సంసరాకమచర్లమందిర సదయవెంకటదాసపోష ॥పల్ల॥

కీర్తన—ఆటతాళం

నాముద్దులరంగనవమోహనాంగ ।ప। కామితమందార । కమనీయ
సుకుమార । రామనామబలరామసహోదర ॥నా। నీమోము నీప్రేమనా
మానసంబున । యేమొవింతదోచె వివరింపునాతోడ ॥నా। ఎన్నాడునిను
మానియున్నావనాస్వామి । అన్నన్న ననుబ్రోవవన్నమహాప్రభో॥నా।గొప్ప
దాతవని కోరికెలూర మాయప్పావునీవని నాశ్రయించుకున్న॥నా।పరమేశ
కేశవభక్తజనావన । కరుణసాగర లక్ష్మీకాంతదయానిధె ।నా। వైకుంఠ
మందిరవరలోకసుందర । లోకాధినాథనాలోన గలిగినస్వామి ॥నా। వసు
దేవవరబాలవర్ణితవరశీల ॥ అసురహరణశరణాగతరక్షణ ॥నా। బ్రహ్మాండ
నాయకభక్తమనోల్లాస బ్రహ్మస్వరూప శ్రీపరమాత్మసర్వజ్ఞ ।నా॥ గురు
జనపరిపాల వరహితవరశీల॥ కరుణాలవాలశ్రీకాంతచిత్తలోల ॥నా। పంచేం
ద్రియాతీత పావననిర్మిత । పంచబాణజనకభావ్యభామ రూప ॥నా॥ నీచు
డానుయేమి దోచాదువర్ణింప । నీచిత్తమికయెట్లుజూచిననీకృప॥నా॥ తోచి
తోచనివాడదూరభారముదేర॥దాచకనీకృపదాతవనుచునిన్న।నా। గట్టిగనం
దూనివట్టినినీవుచేపట్టకుంటె నేనుహట్టుజేసెదస్వామి।నా॥రట్టడితనమాయెరా
ణించెయీమాయ॥ పట్టువదలలేకభారమాయెనుగదె।నా। మొన్నటినుండినీ
మెచ్చుటదెల్పవు।యెన్నడైనమిక్కిలన్నావనీతోడ॥నా॥ నీయానసినుమాన

లేనురానాయందుపాయకసత్కృపజేయవె నాతండ్రి॥నామాట డకున్న నా
మనసుతాళలేను। కోటికయివనిన్నె కోరియున్ననుస్వామి ।నా। నన్ను గూడి
యుండవన్న యెన్నటికైన।మన్ననమరువకు మాపైమిదప్పకు ॥నా॥కపటా
ముశాయాకు గర్వించనేరాను। అపరాధిఅపరాధినని వేడుచున్నాను। నా।విపరీ
తుడనినన్ను విడనాడజూడకు॥నిపుణమింతయు లేదునీచునినన్నేలు ॥నా। నీవా
డనయ్యుండినీచులవేడితె। ఆవలనీకింతఅపకీర్తిదప్పదు॥నా॥ అభిమానమెనీది
ఆశ్రయించుటనాది।యిభరాజపరిపాలయిందిరమణీలోలనా। చిత్తామెనీదా
యెసెవనిశ్చయమాయె। తత్తారమునుదలతుసద్వినయ॥నా। మరివకసారినీ
వరసుందరముజూపు॥ మురసెదనాతండ్రిమోహనరూపక ।నా॥అంగాజజనక
నీసంగాతిగనుగొని॥ చెంగటనిలచిప్రసంగము జేసెద॥నా॥ మనసురంజిల్లనీతన
యుడనయ్యుండి॥వనజాక్షనీపాదవర్ణజేసెద ॥నావన్నెవన్నెలచిలుకవయ్యార
ముఁజగుల్కు।నన్ను జేరియుండునారాయణాచ్యుత।నా। ఎప్పుడైననాదుతప్ప
లెన్నకదయ।గుప్పారనాతండ్రికూర్మిరంజిల్లాగ।నా॥ దయవున్నదోలేదోదా
సూడనయ్యున్న॥జయమస్తుయనినుతిశాయబూనినామ ॥నా॥ ఖండచక్కెర
పాలుగలసియున్నదిబొజ్జ। నిండఁబ్రావరనీకుదండాముబెట్టెద ॥నా॥ ఆకార
జూచినన్నాదరించంతండ్రి॥వక్కమాటాడరవసుదేవనందన ॥నా॥ మరుగు
మాయలేదు మనసుమెచ్చుటలేదు॥ కరిరాజవరద నన్నరమరశాయకు ॥నా॥
చట్టబట్టకనాదు చిత్తాముఁరంజిల్ల ॥ పట్టువదలకనిక భారమాయెగదే ॥నా
రకముశాయక నన్నురక్షించగలిగితె ॥ ప్రకటించిచెవినాటపలుకరవకమాట
నా॥నీకన్న నామీదనెనరున్నవారేర సాకీననీవేనిరాకరించినవే ॥నా॥ కంటి
నినీచక్కదనము కన్నులనిండ-బంటుబంటకనాదు జంటబాయకుతండ్రి॥నా॥
మంగళాంగ దళవభంగఖగేంద్రతు ॥ రంగసదానుప్రసంగమహాప్రభో ।
మనసుఆనందించతనువుచెంగలించె ॥వనజాక్షమీకీర్తి వర్ణవశాయగ ॥
నా। శరణుశరణుభక్తవరద గయాపర।సరసరాకమచర్లస్వామి యోగానంద
॥నా॥ తలచాగవెంకటదానూనియుందున ॥ తొలగానిసత్కృపనిలిపి యుం
డవెస్వామి ॥నా॥

— కీర్తన ఏకతాళం —

ఆనందమొందవెమనసా — అనుమానమొందకె మనసా ॥ప॥ ధి

యాగ: వసుదేవకుమారుని చిత్తమునధ్యానముసేయుచు ॥ఆ॥ మురిపెముజెంద వెమనసా మోహముదిగనాడవెమనసా ॥ సరసిజనయనుని వరసుందరచును ॥ కరమొప్పగసీకన్నులగనుగొని ॥ఆ॥సరితేరువానికిమనసా శరణానిపాతిశేరుమనసా ॥ వృసంచారపు హృదయాంతరమున పరమార్థంబగు పద పద్మముగని ॥ఆ॥ సేవించుమేలొందిమనసా ॥ చెన్నొందిభజియించుమనసా యేవేళనైన జీవనమగుశ్రీదేవుని నమ్మక భావములోపల ॥ఆ॥ శ్రీకరమై నదిమనసా ॥ చెలువందినుతియించు మనసా ॥ చేకొనిరాకమచర్లనివాసుడు ప్రాకటముగ పరిపాలనశాయగ ॥ఆనంద॥

## కీర్తన—ఏకతాళం

నారాయణాచ్యుతకృష్ణాకృష్ణా - వేదపారాయణారామ కృష్ణాకృష్ణ ప॥ చారుసుందర వేషకృష్ణాకృష్ణ-భవదాసజనపోషకకృష్ణాకృష్ణ॥నా॥ మకరకుండలభూషకృష్ణాకృష్ణ-భక్తనికరాసంతోషబాలకృష్ణాకృష్ణ ॥నా॥ అకలంకసూనసాకృష్ణాకృష్ణ ॥ లోకప్రకటితశాంతశ్రీకృష్ణాకృష్ణ ॥నా॥ కేశవావాసుదేవకృష్ణాకృష్ణ — సుప్రకాశజనార్దనకృష్ణాకృష్ణ ॥నా॥ భాసురశోభితకృష్ణాకృష్ణ నిజదాసవశీకరకృష్ణాకృష్ణ ॥నా॥ రాకమచర్లనివాసకృష్ణాకృష్ణ పరిరక్షితావెంకటదాసకృష్ణాకృష్ణ ॥నారా॥

## కీర్తన—ఆటతాళం

తలతునయ్యానినుదాపారథేయాని ॥ తలచెటినాచిత్తచలనమెల్లాను మానికొలచెదమీపాదజలజాతంబులుపలుమరువలగొనితలచి మొక్కుచును - యిలపాలకరఘుకులదీపకసత్కలితనుగుణాకలిమిపంటయని ॥ ప ఉకరించికలుపరించి వెళవుగాంచి చెలువుమీరగను ॥తె॥తలతునయ్యానాప్రియుడావురమ్మని-సుశుభముగానిన్ను చూడనెమ్మదిబూని - నిలచెదమీకడ సేవపుడూరగ - వరనొప్పగనినువలుమరిబొగడుచు - లలితశాంకజయ అక్షయ్శంకరమునికులజీవన సాకోరికలిమ్మని - పాలికిమించీలలివహించి — నిలువరించిజలజనాభయనీ ॥శ॥ కందునయ్యా నాకనుపండువుగాను — పొంగుగలసిబ్రహ్మానందమొందుచూను అందమంది మేసందినరేయనుచుందుధిక్తునింపొందిపరవశయిజెంది మహామునివందిత వరముకుందహరెనా

యందునిలువుమనుచుందు ముందుపొందుగవిందు చెలునందమీకథ ॥త॥ శరణుశరణు నిజసేవకపోషణ - నిరుపమసుందరవరమవిశేషణ - పరవైభవభాసురనిత్యోత్సవ సరసిజభవనుతచరణ సరోరుహాకరిరక్షణ రాకమచర్లాధిప - గరుడగమనవెంకటదాసావన - దురితదూరా - పగవిహారా-పరమశూరా -గురుచరితుడవని ॥తం॥తు॥

కీర్తన ఆటతాళం

శ్రీవాసుదేవునిరమ్మనె - చెలియారోనన్నేలుకొమ్మనే ॥ప॥ భావించినేవాక్య-పనివిన్నవించెదనావేతహరితోడుతదెల్పవే-శ్రీమన్నారాయణునినన్నుగల్పవే ॥శ్రీ॥ వేడెదహరిపొందుశాయవే-నాజాడవానితోమనవిశాయవే-కూమన్సరుబుద్దిగోరకున్నదికనేడునాథయమెల్లబాపవె - స్వశజాక్షునికనులజూపవె ॥శ్రీ॥ కలనైన యేమూరకున్ననె - ఘనముగ మరులొందియున్ననె - తలచిదలచివాని పలుకరించితెమేను పులకించిపరవశమాయెనె - కలికినావశముగాదాయెనె ॥శ్రీ॥ మానినిబహుదయజూడవె - అనుమానమునీలోనమానవె - మానాభిమానిముమరివానిదనుకున్న - నానోముపలమేమొతెలియదు - వానిగానక నాబుద్ధిశిల్పదు ॥శ్రీ॥ తరమునంతోషము నొందవె-భామశ్రీహరియందు జెందవె - ధరణివెంకటదాసునరలేకబోచేటి సరసరాకమచర్లస్వామిని-సన్నుతించవెముద్దుభామిని ॥శ్రీ॥

—కీర్తన—ఏకతాళం—

రామరార నాస్వామిరార - నామనోనాయకలక్ష్మీనాథరార ॥ప॥ కృష్ణరార-శ్రీకృష్ణరార-తృష్ణదీరగానుకరుణతోడరార॥రా॥ అన్నరార-సుప్రసన్నరార-కన్నెడశాయకునిన్నుగందురార ॥రా॥ అప్పరార - యెవరితోజెప్పరార-గొప్పకన్నులానుతయగుప్పరార॥రా॥ వెంతురార-చూచితెమురతురార-చిరునవ్వుతోడుతనన్నుజేరరార ॥రా॥ గురుడరార నావడయరార ॥ సరసరాకమచర్ల నిలయస్వామిరార ॥రా॥

— కీర్తన - ఆటతాళం —

మేలుదొరకినట్టుబాలగోపాలనిన్నేలాగుగనుగొందునూ ॥ప॥ పాలుమాలినహేయగుణముల పాలుజెందితినెమిసేయుదు - యేలనామనవాల్ర

కించపుస్త్రీలవర్గ విశాలలోచన ॥మే॥ దేహాభిమానాము దిప్పాముండగచాల దీనత్వమును జెందితి - అహంభావమునొందిఆశకామాందున అణచగలేనైతి - కూహకపుమద మెక్కి పరులనుకొంచి కూటికి కాంక్ష సేయుచు దేహపోషణకెప్పుడుదిరుగుచు తీవ్రమతినై యుంటినయయో ॥మే॥ అకటలోకవాసనాదులలోనయ్యా సుకరంబుమది తెలియకా -పకరన్నగాని సంతోషమువదలక వైరిమిత్రుచనుచుకొని - నికటమాయెను దినదినంబుకు వ్యర్థమనుచును దోచెనాయువు సకలజనులుబోధిచెదొరవని నరగుననునీమరుగు జేరితి ॥మే॥ కడువేడ్కలోడ రాకమచర్లనిలయమీకథలునమ్మనైతి - విడువాని మోహాగ్నికడ తేరలేక నెక్కుడు తాపమును జెందితి - తడవుశాయక నేడునాలోను దువరా వకరెండుమాటలు విడచెదవు కరుణింతువో నావిన్నపము యేరీతి జూతువో ॥మే॥

— కీర్తన — ఝంపెతాళం —

బహుదినములాయె నినుప్రస్తుతింపుచునున్న పాలించినన్నేలవే - రాకే - అహాహ యెంతని సేదుకున్న దాసునియందు సాహసంబూపడాయా మాయా వ మహిలోననాకన్న మనుజాధములు లేరు మహిత ధర్మము దప్పకూ _ పరాకు - మొక్కివేసారితిని మోహానాకాంక్ష మోక్షమైనజూపవే మాస్వామి ॥బ॥ పెక్కుమాయలవన్ని చిక్కజేయుకునీకె దక్కితిని బ్రోవలే వా -దేవా యెక్కువేమిడలంచ హితవునీదనుకున్న నిక్కముగ దయజూడవే ॥బ॥ కక్కసంబొమంసు కరుగదేమికనీదు చక్కదనమునకు మురిపెమా రామా! శరణుశరణని యె త మొక జేసినా గాని తిరిగైనజూడగదరా ధీరా॥ బ॥ కరుణాశాలివి యెంత ఘనమును మహాపొగడుదును సిరహితుకుడనును [illegible] రమ్మీ నెరహాణ పారసి చరిత [illegible] ధరణిలో పొగడుచుండూ ॥ ముందూ - సరసరాకమచర్లస్వామి పండని బిరుదునమ్మినవాడరా ॥ధీరా॥ బహు॥

— కీర్తన — అటతాళం —

హోరామయ్యా - ముక్కెదవేగ రారారామయ్యా ॥ప॥ సాకెనా [illegible] నిన్ను సన్నుతి శాయగ బాధకుశేరినకీరాముని విధమాయె ॥హో॥ పలుమా

మనిన్నెంత పలువరించినగాని - కలలోనిధనమూన కాశించువిధమాయె ॥ నో॥ దండిగనీకునే దాసుడవయ్యున్న యెంతమావుడిడ యుండినవిధమాయె ॥నో॥ సరసరాకమచర్ల స్వామిసాక్షిగనిన్ను మరులుకొన్నమాటలాయె ॥నో॥

### కీర్తన—ఆదితాళం

తామసినగుమోముజూపుమరి ప్రేమజెలంగగనూ - తామరసాక్షవిరామమోహావర కామితఫలదసుకార్యవిచక్షణ ॥ప॥ నిన్నుగాంచికడు సన్నుతిజేసెద నేరములెన్నకుమీ—విన్నపమురువినుమన్న మిమ్ములను వేడుకజూచెదమా । మరినే నన్యుడగానిక ఆశ్రయించితిని క్రొన్ననవిలుతునిగన్నమురారే ॥రా॥ ప్రాకటగుణగణభక్తపాలన మరిని కేళ్ళంటి — యేకాలదినన్నేలెదవో నీకాశజెందియుంటి—యికమరి రాకమచర్లనివాసుడవయ్యు నిరాకరించదగదోకరుణాకర ॥రా॥

### కీర్తన—ఆటతాళం

ఎంతకాని వేడుకుందునూ నీకరుణరాదిక యేమిరా నేనేమిసేతునూ ప॥ ఎంతకానివేడుకుందును యేమినీమనసింతకరుగదు అంతకంతకు నామనంబున చింతదోచెనిరంతరంబున-పంతమునాతోడసేయకు - బహుదీనుడనుచును వింతచెనన్నెడబాయకూ - యీజగతిలోశ్రీమంతుడవై వేరుజేయకె మరినిన్ను లక్ష్మీకాంత వరబలంతదైత్యనిహంతకలితనితాంతభాగ్యతనంతకుజధ్వాంతదినకరశాంత గుణవిశ్రాంతహారని ॥నెంత॥ చొక్కమైన దాతవందురూ స్వవారలెల్లజూచినా నినుమెచ్చుచుందురూ— వెక్కసంబిక యేలనావ్యధ లెక్కసేయగకొలదిగాదిక దిక్కునీవని నమ్మికొని పెంపెక్కనాగుణశాలివనుమను మొక్కికన్నులజూడవూ - నేనెంతవేడిన వక్కలైనమచ్చటాడవు— నీవాడననుచును ప్రకృకన నాతోడగూడవు ॥ బ్రహ్మాదులాచెజిక్కకనుబహుమాయలనుజయమొక్కకుజనుల దక్కనివ్వకన్పక్కజేసిన పెక్కురూపుడు ఆక్కరేమని లోచునాపై ॥యం॥ కోవమందుట ఘనులమెప్పగునా—నీనామమందాలావమందుట నాకుతప్పగునా—మావు రేవులనిన్ను మరిగృహదీపముగభావించిమరినా యాపదలుబోదో

ఋమసినీపాత్రిపుజేరిసగానినా పరితాపముబోదోలవేమందూ – నీవాడననిమ
దిలోపలను గురినాటదామందూ – వరసుందరంబగురూపమేటికి జూపవను
కుందూ–ఈరీతిననిన్నికరాపుశాయకు మీపదాబ్జముదాపుగని యాలాప
మందితికోపగించకనీదుసత్కృపజూపుభవ్యకలాపశ్రీధర ॥యం॥ యితరమే
మిలేదునావలన - శరణాగతులకు హితవుగలిగినబిరుదునీవలనా– తెలియన
హ్మామలేక దీనులప్రతిదినంబును బోషితుపనినా మతినమ్మికమిమ్మనుతి జే
సితిని రాకమచర్లమందిర సతతధర్మపరుండవనివింటి -సజ్జనులుపొగడగసా
క్షీనామదిచాలగనుగొంటి – బహునిష్టసత్యవ్రతములెల్లను నీవేయనుచుం
టి - సురమానిభూసుర వితతులెల్లను నీదుమహిమోన్నతము కాశ్చర్యంబు
నొందుదు రతిశతూహల మొందెదను సద్గతినహింపగజేయవెనను ॥యం॥

## — కీర్తన—ఆటతాళం

తడవైననిన్నుజూడక తాళలేనయ్యారామయ్య - యెడలేనిధనము
నవనియెంచినానయ్యారామయ్య ॥ప॥ చెడనాడకుమీసేవకుడనునాయెడ
సంశయమింక యేలనయ్యనీను–బశిబడిబిడువకు ప్రస్తుతిజేసితి పుడిమిలోనబ
హువుణ్యాత్ముడవని ॥త॥ చెలికానినలెనే నన్నుగలసియుండవెరామయ్య-
చులుకాదానాముిలేక చూచుచుండవేరామయ్య - వలనొప్పగనినుదలచి
నవారికినులభుడవై మదిశోభిల్లుదువట - వలుకులముద్దులు గులుకగబహు
దయజిలుకగలడుదయ సేయుటకునుమరి ॥తడ॥ జయమానిన్నువినుతిజేతు
మా మయ్యారామయ్యా -ప్రియభావామానరమ్మని పిలుతువోయయ్యా
రామయ్యా – భవవిరహితభూపాలశిఖామణి నయగుణసంయుతనారాయ
ణ — దుర్నయజనహారసురనాథా సుజనసల్క్రియనర్తన శ్రీకేశవనీదయ॥
త॥ కరువ్రాదిరాగ నినుగందునోయయ్యారామయ్యా - పరవాశామానన
బుద్ధిజెందునోయయ్యా రామయ్యా – స్థిరముగరాకమచర్లస్వామివైమ
రువవలదు అనుమానమేలయా - స్మరణమరిగి బహుమురిపెమునొందుచు
ధరణిలో వెంకటదాసుభజింపగ ॥తడ॥

## కీర్తన—ఆటతాళం

శరణుశరణురాఘవా - మహానుభావ - శరణుశరణు ॥ప॥ వరసజ

